# MADRAS GOVERNMENT ORIENTAL SERIES

**Published under the authority**
**of the**
**Government of Madras**

*General Editor*
T. CHANDRASEKHARAN, M.A., L.T.,
*Curator, Govt. Oriental Manuscripts .*
*Library, Madras*

**No. XIII**

# యోగదర్శనవిషయము

# YOGADARSANAVISAYAMU

CRITICALLY EDITED WITH INTRODUCTION

BY

VIDWAN

**Vedam Lakshmi NARAYANA SASTRI, B.O.L.,**

*of Pudur.*

---

GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS

**1950**

**Price Rs. 1-2-0**

# INTRODUCTION

The Government of Madras took up for consideration the question of publication of the various manuscripts in different languages on subjects like philosophy, Medicine, Science, etc., early in May 1948. Important Manuscript Libraries in the Madras Presidency were requested to send a list of unpublished manuscripts with them for favour of being considered by the Government for publication. The Honorary Secretary of the Tanjore Maharaja Serfoji's Sarasvathi Mahal Library, Tanjore, alone complied with this request. This list as well as a similar list of unpublished manuscripts in the Government Oriental Manuscripts Library, were carefully examined and a tentative selection of manuscripts suitable for publication was made. The Government in their Memorandum No. 34913/48-10, Education, dated 4-4-1949, constituted an Expert Committee with the Curator of the Government Oriental Manuscripts Library, Madras, as the Secretary, for the final selection of manuscripts suitable for printing and for estimating the cost of publication.

The following are members of the Committee:—

1. Sri T. M. Narayanaswami Pillai, M.A., B.L.,
2. ,, R. P. Sethu Pillai, B.A., B.L.,
3. ,, C. M Ramachandra Chettiar, B.A., B.L.,
4. ,, R. Krishnamoorthy, (Kalki)
5. Dr. N. Venkataramanayya, M.A., Ph.D.,
6. Sri M. Ramanuja Rao Naidu, M.A., L.T.,
7. ,, V. Prabhakara Sastri.
8. ,, N. Venkata Rao, M. A.,
9. ,, H. Sesha Ayyangar.
10. ,, Masthi Venkatesa Ayyangar, M.A.,
11. Sri M. Mariappa Bhat, M.A., L.T.,
12. Dr. C. Achyuta Menon, B.A., Ph.D.,
13. ,, C. Kunhan Raja, M.A., D. Phil.,
14. ,, A. Sankaran, M.A., Ph.D., L.T.,
15. Sri P. S. Rama Sastri.
16. ,, S. K. Ramanatha Sastri.
17. Dr. M. Abdul Haq, M.A., D.Phil. (Oxon)
18. Afzul-ul-Ulama Hakim Khader,

19. Sri P. D. Joshi,
20. " S. Gopalan, B.A., B.L.
21. " T. Chandrasekharan, M.A., L.T.,

The members of the Committee formed into Sub-Committees for the various languages, Sanskrit, Tamil, Telugu, Kannada, Malayalam, Mahrathi and Islamic Languages. They met during the month of May, 1949, at Madras and Tanjore to examine the manuscripts and make a selection. The recommendations of the Committee were accepted by the Government in G. O. No. Mis. 2745 Education, dated 31-8-1949 and they decided to call these publications as the "MADRAS GOVERNMENT ORIENTAL SERIES," and appointed the Curator, Government Oriental Manuscripts Library, Madras, as the General Editor of the publications.

The following manuscripts have been taken up for publication during the current year :

"A" FROM THE GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS.

TAMIL

1. Kappal Śāttiram.
2. Anubhava Vaidya Muṟai
3. Āttānakōlāhalam
4. Upadēśa Kāṇḍam
5. Cōḷan Pūrva Paṭṭayam
6. Koṅga Dēśa Rājākkal
7. Sivajñāna Dīpam
8. Sadāśiva Rūpam, with commentary.

TELUGU

1. Saṅgītaratnākaramu
2. Auṣadha Yōgamulu
3. Vaidya nighaṇṭuvu
4. Dhanurvidyā Vilāsamu
5. Yōga Darśana Viṣayamu
6. Khaḍga Lakṣaṇa Śirōmaṇi

SANSKRIT

1. Viṣanārāyaṇīyam
2. Bhārgava Nāḍikā
3. Hariharacaturaṅgam

4. Brahmasūtravṛtti—Mitākṣarā
5. Nyāyasiddhānta Tattvāmṛtam

MALAYALAM

1. Garbha Cikitsa
2. a. Vāstulakṣaṇam
   b. Silpaśāstram
   c. Silpaviṣayam.
3. Mahāsāram
4. Kaṇakkusāram
5. Kriyākramam

KANNADA

1. Lōkōpakāra
2. Raṭṭamata
3. Dīkṣābōdhe
4. Aśvaśāstram
5. a. Auṣadhagaḷu
   b. Vaidyaviṣaya
6. Saṅgītaratnākara
7. Swpaśāstra.

ISLAMIC LANGUAGES

1. Jamil-Al-Ashya
2. Tibb-E-Faridi
3. Tahqiq-Al-Buhran
4. Safinat-Al-Najat

---

"B" FROM THE TANJORE MAHARAJA SERFOJI'S SARASVATHI MAHAL LIBRARY, TANJORE

TAMIL

1 Śarabhēndravaidya Muṟai (Diabetes)
2. Do (Eyes)
3. Agastiyar 200
4. Koṅkaṇarśarakku Vaippu
5. Tiruccirrambalakkōvaiyār with Padavurai
6. Kālacakram
7. Tāḷasamudram
8. Bharatanāṭyam
9. a. Pāṇḍikēli Vilāsa Nāṭakam
   b. Pūrūrava Cakravarti Nāṭakam
   c. Madana Sundara Vilāsa Nāṭakam

d. Percy Macqueen's Collection in the Madras University Library on Folklore.
10. Rāmaiyan Ammānai
11. Tamil Pāḍalkaḷ including pattinattār Veṇbā and Vaṇṇaṇkal

TELUGU

1. Kāmandakanītisāramu
2. Tāḷadaśāprāṇapradīpika
3. a. Raghunātha Nāyakābhyudayamu
   b. Rājagōpāla Vilāsamu
4. Rāmāyaṇamu by Kaṭṭa Varadarāju

MAHRATHI

1. Nāṭyaśāstra Saṅgraha
2. a. Book of Knowledge
   b. Folk Songs.
   c. Dora Darun Veṇi Paddhati
   d. Aśvasa Catula Dumani
3. a. Pratāpasimhendra Vijaya Prabandha
   b. Sarabhēndra Tīrthāvaḷi
   c. Lāvaṇi
4. Dēvēndra Kuravañji
5. Bhakta Vilāsa
6. Slōka Baddha Rāmāyaṇa

SANSKRIT

1. Aśvaśāstra with Tricolour Illustrations
2. Rājamṛgāṇka
3. Cikitsāmṛtasāgara
4. Āyurvēdamahōdadhi
5. Gīta Gōvinda Abhinaya
6. a. Cōḷacampū
   b. Sāhēndra Vilāsa
7. Dharmākūtam - Sundara Kāṇḍa
8. Jātakasāra
9. Viṣṇutattvanirṇaya Vyākhyā
10. Saṅgīta Darpaṇa
11. Bījapallava

It is hoped that the publication of most of the important manuscripts will be completed within the next four years.

Some of the manuscripts taken up for publication are represented by single copies in the Library and consequently the mistakes that are found in them could not be corrected by comparing them with other copies. The editors have, however, tried their best to suggest correct readings. The wrong readings are given in round brackets and correct readings have been suggested in square brackets. When different readings are found, they have been given in the foot-notes except in the case of a few books, in which the correct readings have been given in the foot-note or incorporated in the text itself.

The Government of Madras have to be thanked for financing the entire scheme of publication although there is a drive for economy in all the departments. My thanks are due to the members of the Expert Committee who spared no pains in selecting the manuscripts for publication. I have also to thank the various editors, who are experts in their own field, for readily consenting to edit the manuscripts and see them through the Press. The various Presses that have co-operated in printing the manuscripts in the best manner possible also deserve my thanks for the patience exhibited by them in carrying out the corrections made in the proofs.

The present work is a very ancient one. The subjects dealt in this are mostly on Yōga ; reference is also made to other systems.

There is only one palm-leaf manuscript of the above work available in the library described under No. D. 2172. The size is $18\frac{1}{4} \times 1\frac{1}{2}$ inches. It contains 41 pages of 5 lines on a page. The condition of the manuscript is much injured and the mode of writing is not good.

My thanks are due to Sri N. S. Sundaresvara Rao, and Sri T. L. Narasimha Rao, B. Sc., Telugu Pandits of the Library for Comparing the Press Copy with the original.

Govt. Oriental Manuscripts Library Madras.

T. CHANDRASEKHARAN,
*General Editor*
*Madras Govt. Oriental Series.*

# పీఠిక

స్థావరజంగమాత్మకమైన యీప్రపంచమున సకలజీవులును సుఖదుఃఖముల ననుభవింపవలసిన వారై యున్నారు. వారికి సుఖమునకన్న దుఃఖమే యధికతరమగుటచే సుఖాభిలాషయే ప్రియతరమగును. కాని యీసుఖదుఃఖముల విషయమున మానవున కేవిధమైన స్వాతంత్ర్యమును లేదనుట అనుభవైకవిషయము. అంతేకాదు, మానవులు అవిద్యాపశువులనుటయు సుస్పష్టమే. కనుకనే విద్యాస్వరూపమును పరిశీలించు యావశ్యకత కలుగుచున్నది. ఈపరిశీలనచే సత్యస్థితి బోధపడునుగాన అవిద్య స్వయముగ నశించును.

సుఖము విషయసుఖము, బ్రహ్మానంద మని ద్వివిధము. విషయసుఖము బాహ్యపరికరసాధ్యము; అనుభవసిద్ధము; అనుభవోత్తరక్షణమందే దుఃఖప్రదము. దానిసంపాదనము ధనద్రవ్య దేహాయాసకాలవిలంబనముల నాశ్రయించినది. బ్రహ్మానంద మన్ననో ఆత్మస్వరూపజ్ఞానముచే సిద్ధించునది. తత్సంపాదనము విచారణమూలకము. తత్సుఖము బాహ్యపరికరముల నాశ్రయించినదికాదు. లభించినతరువాత దానికంతము లేకుండుటవల్లను, అది ధనద్రవ్య దేహాయాసాది ప్రమాదవశము కాకుండుటవల్లను నిత్యసుఖ మనఁబడును.

పూర్వోక్త విషయసుఖములు బ్రహ్మానందముయొక్క వాసనా ప్రతిబింబములు. ఇట్టి నిత్యసుఖాపేక్ష కలవారు సుఖేచ్ఛ జనించిన పిదప ఆత్మస్వరూప విచారణచేయవలెను. ఆ స్వరూపజ్ఞానము కలుగుటకును ఆ విచారణకును ధర్మజ్ఞాన మత్యావశ్యకము. ఆ విషయమై అనాదిగ నిరంతరకృషిచే సఫలమందినవారు భారతీయమహర్షులు. కనుకనే మన భరతఖండము ధర్మప్రధానభూమిగా వెలసినది.

ధర్మస్వరూపమును ప్రకాశింపఁజేయు సాధనములు నిగమాగమములనుట సర్వసమ్మతవిషయము. నిగమములన ధర్మమును నిస్సంశయముగ

నిశ్చయించునవి యని పెద్దల నిర్వచనము. అవి మంత్రబ్రాహ్మణోభయాత్మకమగు వేదములే యని నిర్దేశింపఁబడినవి. వేదములే ధర్మమునకును విద్యకును స్థానము లని ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి. ఆ విద్య పరాపరభేదముచే ద్వివిధము. వేదప్రతిపాదితమైనది ధర్మమనియు, తద్విపర్యయము అధర్మ మనియు మనువును, సాంగోపాంగమగు వేదము విద్యకును ధర్మమునకును స్థానమని యాజ్ఞవల్క్యులును వివరించి యున్నారు. వీరిమతమున పురాణములు, మీమాంస, ధర్మశాస్త్రములు ఉపాంగములు ; శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్ప మనునవి అంగములు.

విద్య పరాపరభేదముచే ద్వివిధముగదా! అందు అపరవిద్య ఋగ్వేదాదులు, పరవిద్య ఉపనిషత్తులు. ఉపనిషత్తులును తదర్థానుసారు లగు గ్రంథములును ఆత్మవిచారణకు సాధనములుగ నున్నవి. వేదములు కర్మ, ఉపాసన, జ్ఞానభేదములచే మూడుకాండములుగ విభజింపఁ బడియున్నవి. జైమిన్యాది ఋషిప్రోక్తము లగు పూర్వమీమాంసాదులు కర్మకాండ; నారదాదిప్రోక్తములగు పాంచరాత్రాదులు ఉపాసనాకాండ; వ్యాసాది ఋషిప్రతిపాదితములగు నుత్తర మీమాంసాదులు జ్ఞానకాండ. ఇట్లే ఆగమస్మృతులందును మూడుకాండలు కలవు. వేదములకువలెనే ఆగమములకును పెద్దలుధర్మస్థానత నొప్పుకొనుచున్నారు.

నిగమము లొకరిచే చేయఁబడక గురుపరంపగా వినఁబడుచున్నట్టివి గావున వానికి శ్రుతు లనియు నామాంతరము. అట్టివేదార్థమునే ప్రతిపాదించునవి గనుక స్మృతులును ధర్మప్రమాణములు. పూర్వమహర్షులచే తెలుపఁబడిన వేదార్థమునే స్మరింపఁజేయునవి కావున స్మృతు లని పేరు కలిగినది, "శ్రుతిస్మృతీమమైవాజ్ఞే" అనిభగవదుక్తిగదా! వేదార్థమును స్మరింపఁజేయు మన్వాదులకు ధర్మశాస్త్రప్రవర్తకత్వము చెప్పఁబడినది. కనుక ధర్మమునందు మన్వాదులుపలికిన స్మృతులకెట్లు ప్రామాణ్యమో, అట్లే కలికాలుష్యముచే శ్రుతిస్మృతి ధర్మములు లోపించియున్న మానవులకు సాక్షాచ్ఛివభగవానునిచే ప్రోక్తములైన ఆగమస్మృతులును ధర్మప్రమాణము లగుట నిస్సంశయము,

ఆగమములును నిగమముల వలె కాండత్రయాత్మకములు. వానిలో కర్మకాండ ఉపాసనాకాండమునకంగముగానే చేర్పఁబడియున్నది. జ్ఞాన కాండము ప్రత్యేకముగ సూత్రరూపమున వెలయుచున్నది. సాధారణ ముగ నీ యాగమములు లోకములో కర్మపాశబద్ధులై జననమరణప్రవాహమునఁబడి సంసారసాగరమున మునిఁగిపోనున్న జంతుజీవ వర్గములను తరింపఁజేయుటకై పరమ కరుణామూర్తియగు పరమశివుఁడు పార్వతీదేవికి ఉపదేశించినట్లు సంప్రదాయసిద్ధముగ తెలియవచ్చుచున్నది.

ఆత్మవిచారణసాధనము లగు గ్రంథములందును అధికారి, విషయము, సాధనము, ప్రయోజనము అను నాలుగును ముఖ్యాంశములు. అందు వేదాధికారము సకలజనులకును లభ్యముకాదు; ఆగమవిషయమున నట్లు కాక సర్వజనులకు నధికారము కలిగియుండుట యొక్క మహావిశేషము. ఈ ఆగమీయోపాసనాకాండము వేదమునకు సంబంధించినదే యని రామపూర్వోత్తర తాపనీయాదులమూలమున తెలియవచ్చుచున్నది. ఇచ్చట విశేషించి మంత్రజాతము, యంత్రజాతము, తంత్రము అని ఇతి కర్తవ్యతారూపమున శివునిచే చెప్పఁబడినది. ఈ యుపాసనాకాండము వైదిక కర్మోపాసనా కాండముకంటె సార్థవ్యయ ఆయాసములచేత పూరితమైయుండుటవలనను పూర్వతంత్రములలో నొక్కొక్క తంత్రమున కొక్కొక్క మంత్ర విధానము నిశ్చయించుటవలనను అతి విస్తరము భావగంభీరమునై సుకుమారమతులు, అల్పాయుష్కులు, అల్పమేధసులునగు అధునాతనులకు సుబోధకములు కాకపోయినవి. దీనిని గుర్తించిన పరమకారుణికోత్తము లగు పెద్దలు సుగమములగు మార్గోపదేశక గ్రంథముల వివరించిరి. వానిలో వేదాంత విషయప్రబోధకములు యోగవిద్యా ప్రతిపాదకములు ముఖ్యములు. అవి సాంఖ్యాది యోగశాస్త్రవిషయములను గురూపదిష్ట మార్గమున సవివరముగా హృదయరంజకముగా ప్రకాశింపఁజేయును.

ఈ గ్రంథము లన్నియు సంస్కృతభాషలో నుండుచే నాభాష తెలియని వారి కవిదుర్బోధకములుగనే పరిణమింపఁగా లోకహితైషులు వానిని దేశభాషలలోనికి గద్యరూపముననో పద్యరూపముననో అను

వదించిరి. వానిని పరిశీలించిన వేదాంతవిషయములు జనసామాన్య మున కెట్లు సుగమముగావింపఁబడెనో విశదమగును. అట్టియనువాదము లలో ప్రకృత గ్రంథ మొకటి.

ఈ గ్రంథము "యోగదర్శన విషయ" మని పేర్కొనఁబడి యున్నది. యోగాభ్యాసమునకు మార్గదర్శకమగు విషయమును ప్రతి పాదించు గ్రంథ మని దీనికర్థము. ఇది ప్రాచ్యలిఖిత పుస్తకాలయమున 2172–సంఖ్య కలది. తెలుఁగు గ్రంథముల వివరించు కేటలాగు 9–వ వాల్యూమునందు పీఠికలో దీనింగూర్చి యీ వివరణము కలదు.

"D.No. 2172 Yogadarsanavishayamu:-This seems to be a very ancient work on Sivayoga written in Sanskrit verse and it contains also a brief exposition in Telugu for each Sanskrit verse. The real title of the work and the name of its author are not known. It is called Yogadarsanavishayamu merely from the subject—Yoga, with which it deals. Reference is made in this to the Sankhya and other systems of philosophy. It is divided into chapters-skandhas. The third Skandha is called the Vimarsa Skandha and the fourth the Vibhuti Skandha."

అందే 2446–వ పుటలో నిట్లున్నది :

"Substance, palm-leaf. Size, 18¼ × 1½ inches. Pages 41, Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good but free from mistakes.

This is a very ancient work on Sivayoga. The name of the author and the title of the work are not known from this. The work is divided into Skandhas; third Skandha has got the other name Vimarsa Skandha and the fourth Skandha Vibhuti Skandha. The Subjects dealt with in this are mostly on Yoga; reference is also made to other Systems."

ఈ చివర తెలుఁగున నిట్లు కలదు.

" అసమగ్రము, గ్రంథారంభమున నాలుగు శ్లోకముల విషయము లోపించిన ట్లున్నది. ఒకటి రెండాకులు పోయియుండును. వ్రాఁతమంచిది గాదు. తప్పులు లేవు. శైథిల్యముగలదు. గ్రంథపాతములు కొలఁదిగాఁ గలవు."

ఇప్పుడు ముద్రితమైన గ్రంథమును పరిశీలించిన ప్రథమస్కంధము పూర్తిగాను, ద్వితీయస్కంధాదిని 4 శ్లోక భాగములును లేవు. ఇందు శ్లోకప్రతీకములేగాని పూర్వోక్తాంగ్లభాగమున నుడివినట్లు పూర్తి శ్లోకము లుదాహృతములు కావు. ఆ ప్రతీకముల యాధారమున నవి యార్యా వృత్తములేమో యని సంశయింపవలసి యున్నది.

ద్వితీయస్కంధాది శ్లోకచతుష్టయమున "జగత్తును అయిదు ప్రకారాలుగా విభజించి చిదాత్మకత్వ సంభావనచేయఁబడినది" అని గోచరించును. ఆ అయిదు ప్రకారాలేవో మఱియెచటను ప్రసక్తి లేదు. తృతీయ చతుర్థస్కంధములకు విమర్శవిభూతిస్కంధములను ప్రత్యేక నామము లుండఁగా మొదటి రెంటికిఁగల నామముల నూహించుటకైన నాధార మగపడదు.

ద్వితీయస్కంధ విషయము :

విశ్వము సోమ, రవి, వహ్నిలక్షణములు గలది. భోక్తృత్వాది విశేషరూపముచేత తోఁపఁబడు భోగ్యాదుల నిర్విశేష ప్రతీత్మాకమైనది బిందువు. దాని వికారమే ప్రాణము. స్థూలసూక్ష్మరూపముగు జగత్తు చిత్తు కంటె బహిర్భావముగ లేదు. ఈ చిత్తువల్ల నానావిధ సిద్ధినపేక్షించి అనేకు లనేక విధముల నుపాసింతురు. బిందువును పదునాఱు ప్రకారములుగా భిన్నాధారములందు భావన చేసి యోగులు కొందఱు పాసన చేయుదురుగాఁ సిద్ధులు చేయరు. వారు చితిని ఏకాత్మ్యంగా నిరంతర ముపాసనచేయుదురు. అని చెప్పి బిందువునకు మార్తాండత్వమును ఆత్మకు విశ్వాత్మ్యము ననుభవోపన్న మని నిరూపింపఁబడినది.

తృతీయస్కంధము :—ఇందు ప్రారంభమున ఆధారాధేయ లక్షణమున తోఁచు భేదమును వ్యవహారముచేత నిరూపించి, గ్రాహకసామాన్యా

వేత్తచేతను గ్రాహ్యావేత్తచేతను చితికి అభేదము చెప్పి, నీవు నేను అని గ్రాహకములైన మూఁడు స్కంధములవలనను వీనికభేదమును వివేచించినాఁడు. భూమావత్త్వాది శక్తు లప్రత్యక్షము గనుక కార్యముఖము గానే ఆశక్తుల నిరూపించి, అట్లవభాసమానమైన శక్తులచే చెప్పఁబడిన జగత్తుయొక్క విమర్శశక్తి స్పర్శమాత్రముచేత ప్రకాశైకాత్మతను పొందుచున్నదని రుజువుచేయఁబడినది జ్ఞానజ్ఞాతృజ్ఞేయములకు ప్రకాశకంటె భేదభావము నుపపాదించి పరస్పరమును భేదము లే దని తేల్పఁబడినది. జ్ఞాతకు క్రమికత్వము నిత్యసోపాధికము కావున ప్రకాశతాదాత్మ్య నిత్యసిద్ధము. వేత్త కతిరిక్తముగ వేదన మని వేద్య మని కత్ప్యాద్వయ కల్పన మెంత పర్యంత ముండునో విమర్శబుద్ధ్యాకలన మంత పర్యంతమే యుండును. వేద్యమును వేదనమును విమర్శచేసిన రెండును ప్రకాశ బహిర్భావములు కా వనుట సిద్ధ మగును. ఈ విధమున అద్వైతభావము ప్రకాశిత మైనది.

చతుర్థస్కంధమున విభూతిస్కంధము నారంభించి తదంగముగ అప్రబుద్ధాది ప్రతీతి ప్రకారము నిరూపించు ప్రయత్నము చేయఁబడినది. యోగు లేయేభావములచేత నే యేకర్మల నిర్వహింతురో వివరించి ఈశ్వర సదాశివశక్తి శివతత్త్వములు ధారణగల యోగి ఈ స్వరూపుఁ డవు నని పేర్కొని శుకాది మహర్షులప్రతీతి నారంభింతు ననుటతో గ్రంథము నిలిచిపోయినది. ఈ గ్రంథమీస్కంధము తోడనే సమాప్తియగునా కాదా యనుటకును ఆధారములు చాలవు.

గ్రంథమున కొన్నిచోట్ల "చెప్పుచున్నాను" "చెప్పుచున్నాడు" అని శ్లోక వ్యాఖ్యాన పీఠికలో కలదు. ఈ భేదమేలయున్నదో గ్రంథము పూర్తిగదొరకినఁగాని నిశ్చయింప వీలు కలుగదు. అప్పటికే గాని యిది స్వతంత్ర గ్రంథమో, సంకలితమోకూ రూఢిగఁజెప్పుట శక్యముకాదు.

విషయమును జూడ గడుఁ బ్రాచీనమైన శివయోగగ్రంథముగఁ గాన్పించును. చతుర్థస్కందాది నుండు "అంతర్నిరంతర" అనుశ్లోకము చింతామణిస్తవమున 58-వ శ్లోకము. ఇది యాస్కంధము ప్రథమ శ్లోకమని కేటలాగున పేర్కొన్న విషయము వివాదాంశము. గ్రంథము

పూర్తిగ లేనందున నీ శ్లోకమేల యిటనుద్ధృతమో తెలియరాకున్నది. మనస్సును ఆత్మరూపమగు సంవిదగ్నియందు పూర్ణాహుతి చేయుటయే యజ్ఞ మని దీని భావము.

ఇందుల ప్రతీ ములఁ బట్టి మూలగ్రంథమును నిశ్చయింపఁ బ్రయత్నించితిని కానిసఫల మందలేదు. "యోగవిషయ" మను పేర ప్రాచ్య లిఖితపుస్తకాగారమున నొకటిగలదు. సంస్కృత కేటలాగున 9- వ వాల్యమున రెండుప్రతులున్నట్లు 4336, 4337- సంఖ్యలచే తెలియవచ్చును. 4538 సంఖ్యగా అమనస్కగురు కల్ప మను గ్రంథము తెలుఁగులిపిలోఁ గలదు. దీనితోచేరి యొక 'యోగవిషయ' గ్రంథము తెనుఁగులిపిలోనే గలదు. అందలి విషయమునకును ప్రకృత గ్రంథమునకును సంబంధ మున్నట్లు తెలియరాదు. కాని గ్రంథమిట్టి దని గుర్తించు ప్రయత్నములు విడువక సాగించి సఫలీకృతుఁడనైనంతనే లోకమునకు ప్రకాశింపఁ జేయుదును.

ఈ గ్రంథము సంపూర్తిగా వ్యావహారిక భాషయం దున్నది. అన్వయ సౌలభ్యమునకు కాక మఱియేయంశమందును దానిని దిద్దకట్లే విడిచితిని. ఇందలి విరామచిహ్నములునే కూర్చినవగుటచే అన్వయవిషయమున నేదైన దోసగు కలిగినది నాదోషము. గుణగ్రహణపారీణులు గుణములనే గ్రహింతురని వేఁడెదను.

తుదిమాట ఈగ్రంథమును ముద్రణమునకు సిద్ధపఱుచుభారము నాయందుంచి సకలవిధముల ప్రోత్సహించిన లైబ్రరీ క్యూరేటరుగారు శ్రీయుతులు టి. చంద్రశేఖరయ్యరు గారికి నాకృతజ్ఞతాభి వందనము లర్పించుచున్నాను. ఈ సందర్భమున నాకుఁ జేదోడు వాడుగా నుండిన తద్భాండాగారపండితులు శ్రీ నిడదవోలు శివసుందరేశ్వర శర్మగారికిని నే నెంతో కృతజ్ఞుఁడను. ఆయిరువురి ప్రోత్సాహమే లేకున్న నేనీభారమును నిర్వహింప జాల కుందునేమో!

మద్రాసు<br>22-3-50

వేదము లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీ

# యోగదర్శనవిషయము

—: ప్రథమస్కంధము :—

*    *    *    *

—: ద్వితీయస్కంధము :—

*    *    *    *

ఈ రీతిగా జగత్తును అయిదుప్రకారాలుగా విభజించి చిదాత్మకత్వమును సంభావనచేసి మళ్లీన్నీ భావనాలాఘవంకొఱకు మూడుగా విభజించి చిదాత్మకత్వమును ఉపదేశం చేయుచున్నాడు. ౫.

"సోమరవీతి":—ఈప్రకారం భోగ్యంపరాగ్రూపం గనుక సోమలక్షణము. ఇంద్రియములు పరాక్ప్రత్యగ్రూపము లైనవి గనుక రవిలక్షణములు. భోక్త ప్రత్యగేకస్వభావం కలవాడు గనుక వహ్నిలక్షణము. ఈ మూడు స్వభావములు కలదే విశ్వము. ఇదిగాక వేరుగా కించిత్తును లేదు. ఈభోగ్యాదులయొక్క యేభానపిండంకద్దో అది భోగ్యత్వాది విశేష విగళనమందు సామాన్యాత్మకమై విమర్శమయమైన దవుచు బిందువని చెప్పబడుచు నున్నది. ఆ బిందు వొకటే షడధ్వలకు ప్రాణము. ఉదయ విశ్రాంతి హేతువైన దౌటవల్లను, సోమాద్యభిమానం కలిగిన ముగ్గురు దేవతలయొక్క పారమార్థిక స్వరూపము భోగ్యాది త్రయాత్మకమైన ఆత్మభూతమే మండలాదులకు వేద్యరూపత్వంచేతను ఇంద్రియత్వ

* ఈ గ్రంథమున ప్రథమస్కంధమును, ద్వితీయస్కంధమున నైదు శ్లోకములదను కను నిపాతమై యున్నది.—(సం.)

భోక్తృత్వానుపపత్తి వల్ల నుంచియు అది లీలావిగ్రహమండలరూపమైనది గాదు. భోక్తృత్వాది విశేషరూపంచేత తోపబడుచు ఉండేటటువంటి భోగ్యాదులయొక్క నిర్విశేష ప్రతీత్యాత్మకమైనది బిందువు. నిర్విశేషముగా వేరుకాని దనుట. బిందువుయొక్క వికారమే ప్రాణము. ఈ మార్గము ఆరుప్రకారములు. ౬. ౭.

దీనినే విస్తరింపచేసేటందుకు చెప్పుచున్నాను. ఈ జగత్తుస్థూలమని సూక్ష్మ మని రెండుప్రకారాలు. వ్యక్తంగా అగుపడేటి ప్రపంచము స్థూల మనిపించుకొనును. స్థూలరూప ప్రపంచమైన ఘటపటాదులు జ్ఞానరూపకంగా బుద్ధిస్థమయినప్పుడు అదేశక్తి సూక్ష్మ మనబడును.

అక్కడ...చిదాత్మకమై వ్యక్తమై యేయీజగత్తు కలదో అది...దశలయందు నిత్యమై బిందుభిత్తిలగ్న...చేతను, మరల శక్త్యాత్మకమై అవ్యక్తమైనదియు, అక్కడనే మగ్నమైఉన్నది స్థూలముగాను సూక్ష్మముగాను తోచుచున్నట్టి యేజగత్సర్వం కలదో, అదంతా ‘చిత్తు’ కంటే బహిర్భావంగా లేదు; తరంగాదులు ఎట్లో అట్లుఉన్నది. ౮. అనంతరము ఏ యీచిత్తువల్లనుంచి నానావిధసిద్ధ్యపేక్షచేత అనేకవిధ మని కల్పించి కొందరు ఉపాసనచేస్తున్నారో ఆ ఉపాసన చేయదగిన వస్త్వంతరం లేదని చెప్పుచున్నాను. “షోడశధేతి”:— ఈచెప్పబడిన బిందువును పదహారుప్రకారములుగా భిన్నములయిన ఆధారాదులయందు లక్ష్యత్వంచేత నిశ్చయింపబడిన ఆధారభేద లక్ష్యమును, అందువల్లనే బహుసిద్ధికరమయిన ఆధారభేద విశేషమును అపేక్షించునటువంటి సాధకులు పదహారుప్రకారాలుగా భేదపరుస్తున్నారు. ఆధార షోడశకమందు షోడశాత్మకమని భావనచేస్తున్నారు. అట్లే తొమ్మిది ప్రకారములుగా మూడుప్రకారములుగా, ఆరుప్రకారములుగాను భావనచేయుచున్నారు. దీనికి షోడశాదిరూపంచేత భేదం చేయబడుచునుండగా షోడశాదిభేదయోగ ఉపాధి స్వరూపభేదమందు సంభవించదు గనుక ‘సేత్స్యంతః’ అని చెప్పేవానియొక్క అభిప్రాయము. అద్వైత ప్రత్యభిజ్ఞాసిద్ధికొఱకు యోగులే ఈ భేదంచేత ఉపాసన చేస్తున్నారు; సిద్ధులుచేయరు.

వారై తే చిదైక్య ప్రతిపత్తి దార్ఢ్యలక్షణ జీవన్ముక్త్యైకరసం కల వాండ్రు. చితిని ఏకాత్మ్యంగానే నిరంతరం ఉపాసనచేస్తున్నా రని అభిప్రాయము. ౯.

అనంతరం అన్వయవ్యతిరేకాలచేత అంశానకు భావాభావ హేతుభూత మైన బిందువును మార్తాండత్వంచేత చెప్పినవాడవుచు శ్లోకద్వయంచేత సత్యమే నని ఉపదేశం చేయుచున్నాడు:— 'యస్యేతి', "స్వేనేతి". ఈ ప్రకారం ప్రకాశముయొక్క ధర్మిభూతమయిన దానిని ధర్మిత్వంచేతనే చెప్పబడినటువంటి ప్రకాశముయొక్క ధర్మ భూత మైన యేవిమర్శకలదో అది అహంత యని చెప్పబడినటువంటిది. దీని యొక్కకణం ఈ అణుమాత్రమే, వర్ణ పద మంత్రాత్మకత్వంచేతను కలాతత్వ భువనాత్మకత్వంచేతను తోచబడుచున్నది. ఈ ప్రకారము మూడు విధాలయిన దవులవల్ల నుంచియు షడాత్మక మయిన శబ్దార్థ స్వరూపమార్గము. వీడు పరవు మార్తాండుడు. ఏధర్మికి అని జ్ఞాపకము చేయబడిన యేప్రకాశముకద్దో, ఆ ప్రకాశమే లౌకికమార్తాండునికి ప్రకాశకుడు గనుక పరమమార్తాండుడు. ఈ ప్రకాశానకు మార్తాండత్వ మెట్లన్న ప్రకాశముయొక్క చిత్తోన్మఖీభావం వినాయించిన యీ శివాది విశ్వము నిమిషితమై మృతాండమై ఉండును. తనంతటతానే ఉన్ముఖీ భావాన్ని పొందేమహిమచేతను యేకారణంవల్ల నుంచిన్ని జీవింపచేస్తు నున్నదో, యేయీమార్తాండుడు భౌతికాకాశానకు, అవచ్ఛిన్నుడు గనుక "హృదయాకాశమందు నీచేత చూడబడలేదా యేమి?" అనే వాక్యా ర్థంచేత కాలత్రయమందున్ను, దర్శనాభావం నిరసనచేయబడుచున్నది. ఏ ఈప్రకాశరూపము ననుసరించి మృతమైన అండానకు ప్రాణం గలుగ జేయునటువంటిది గనుక పరమమార్తాండుడో ఆ యీమార్తాండుడు హృదయమందు నీచేతను సర్వదా చూడబడుచున్నాడు. వీనిదర్శనం లేకనే వస్త్వంతర దర్శనం కలుగదు గనుక ఆకారణం వల్ల నుంచియు హృదయావచ్ఛిన్న ప్రతీయమానమయిన యే యీఅనవచ్ఛిన్న ప్రకాశ కలదో అదే నీ వని జ్ఞాపకం చేయబడుచున్నది. ౧౦. ౧౧.

జ్ఞాపకం చేయబడినటు వంటివానికి విశ్వోత్పాదకత్వమును విభజన చేసి చూపుచున్నాడు:— "చిద్గగనేతి":— అన వచ్చిన్న చిన్మయమైన సముద్రమును తాను స్వతంత్రంగానే ఇచ్ఛామందరంచేత మథించి కార్యోన్ముఖత్వమును పొందించి ఖేచర్యాది స్వశక్తిరూపములైన తరంగములచేతను, అండాఖ్య మైన చంద్రుని పుట్టించుచున్నాడు. స్వేచ్ఛవల్ల నుంచియు స్వాభిన్నమయిన విశ్వమును స్వభిత్తియందే నీ వని జ్ఞాపకం చేయబడి నటువంటి ప్రకాశము ప్రకాశించుచున్న దని తాత్పర్యము. ౧౨.

అనంతరము అంతరకత్వా విభాగంచేతను పుట్టిన అండము యొక్క స్వాత్మ భిత్తి లగ్నత్వమును స్వానుభవ సాక్షిత్వంచేత చూపు చున్నాడు:—

"శక్తిరితి":–శక్తి అనగా బిందువు. ఆకారణంచేత శుద్ధాధ్వలక్షణ మైన కార్యం కనుపడును. మాయామిశ్రాధ్వాత్మకము ప్రకృతి, అశుద్ధాధ్వరూపము, పృథ్వి, స్థూల భోగ్య భోగాయతనాదికము అని చతుర్విభాగమైన యే అండము కద్దో, దీనియొక్క యేవిభాగము బహు ప్రకారాలుగా భువనాది రూపకమో అదంతా పరప్రకాశమైన నా యందు ఉన్నది......

ఇతి ద్వితీయః స్కంధః



# తృతీయ స్కంధము

---

## విమర్శ స్కంధము

ఇంతమాత్ర గ్రంథసందర్భముచేత ఆత్మకు విశ్వాత్మకత్వము అనుభవోపపన్నమయిన ముక్తిచేత ప్రతిపాదించ బడినది, అనంతరము నిశ్చితమైన వైశ్వాత్మ్యానకు అసంభావనచేతను విపరీతభావనచేతను ఉపరాగము కలుగకుండా మూడోదైన విమర్శస్కంధ మారంభింపబడు చున్నది:—

అక్కడ నాయం దున్న దని చెప్పుటచేతను ఆధారాధేయలక్షణ మైన యేభేదం తోచబడుచున్నదో దానిని వ్యవహారముచేత నిరసన చేయుచున్నాడు :—

''అహమితి'':– నిత్యోదిత ప్రకాశమయుడై అద్వితీయుడైన నేను తేజత్వంచేత అభిమతమైన బుద్ధ్యాది కరణాలలోను ఆదిత్యాదిజ్యోతి స్సులలోను అంతరాత్మ స్వరూపముగా ప్రకాశమానమై వాటిలోపల ఉన్నాను. తమస్సుగా తోచుట వల్లనుంచియు తమస్సులైన మాయాదుల యొక్క అంతః (కూడ) ఉండుచున్నాను. ప్రకాశాత్మ స్వరూపమైన నేను అంతః లేకపోయిన తేజస్త్వంచేత తేజస్సును తమస్త్వముచేత తమస్సును హెచ్చుగా ప్రకాశించును. భిన్న భిన్నంగా ప్రకాశించు నని ఆశయము. ఆతేజస్సులును తమస్సులును నాయొక్క అంతః ఉన్నవి. ప్రకాశాత్మకుడను నేను ఒకడనే భావాభావాత్మకమైన జగద్రూపముచేత స్ఫురించుచున్నాను. అదికారణముగా భేదశంకకు అవకాశము లేదని అభిప్రాయము. ౧.

ఈప్రకారం గ్రాహక సామాన్యాపేక్షచేతను గ్రాహ్యాపేక్షచేతను చితికి అభేదం చెప్పినాడు. నీవు నేను అని గ్రాహకములైన మూడుస్కంధ

ములు వల్లనుంచియు వీనికి అభేదమును వివేచన చేసేటందుకొరకు చెప్పుచున్నాను:—

"ప్రథమ" ఇతి:— వాడు నీవు నేను అని విజాతీయ వ్యపదేశ యోగంవల్ల నుంచియు పరస్పరవిభేదం కలిసిన యేయీప్రథమ మధ్యమ ఉత్తమ పురుషులు కలరో ఆవీరందరు విచారించబడినట్టయితే అభేద మవ్వటచేత మహాపురుషుడనైన నాకంటే వేరుగా లేదు; నాకు వ్యతిరిక్తమైన తత్వాంతరమును లేదు. ఈ ప్రథమాది పురుషులు పరస్పరము భేదంకలవారైనా ప్రత్యవమర్శాత్మక మదేకాయత్త స్వర్గాసవర్గముగల వారు గనుక నే ననేటిభిత్తియందు మదేకాత్మకత్వంచేత తోచబడుట వల్ల నుంచియు నాకంటె బాహ్యమందు లేదు. ౨.

ఓయి ప్రథమ మధ్యమ పురుష ప్రతియోగిత్వంచేత అహమని భేదింపబడుచున్నావు; అవచ్ఛిన్నప్రకాశాత్మకుడవును అవుచున్నావు. ఇట్టి భేదము కలుగుచునుండగా ఏకాత్మ్య మెట్లు అంటే చెప్పుచున్నాడు:—

"యుష్మదితి":— యుష్మదపోహంవలెను శేషాపోహంవలెను మధ్యమ ప్రథమపురుషలవల్లనుంచియు భేదము గనుకనే భిన్నము. ఆ రెంటికిని ప్రతియోగి అయిన అహమనే యేరూపంకద్దో అది భిన్నము వలెనే ప్రకాశించును. అది ఇది 'భానవిభేదమసః' అనే దానివలెనే, త్వం అనే దానివలెనే, నాయొక్క అంశ. విశేష....వహాన వహతి, నేను కాదు, నా యొక్క పారమార్థిక స్వరూపం కాదు. అక్కడ హేతువు నిత్యమైనటువంటిది యేదికద్దో తాదృశ ప్రసిద్ధమైనటువంటి ఒకడైనటువంటి అనవచ్ఛిన్న ప్రకాశఘనుఁడైనటువంటి వాడనవు చున్నాను. ఈ కారణంవల్ల నుంచియు అవచ్ఛిన్నమవుటవల్ల నుంచియు ప్రకాశాత్మక పురాతనమైనటువంటిది నా యొక్క స్వరూపము అహం అనేది ఆ రూపము. "అవచ్ఛిన్నత్వాదాగఁతుకం, తత్స ఇత్యాదివత్" అంశవిశేషమే అని భావము. 3.

"ద్యావాపృథివీతి":— గ్రాహకుడు విశేషంగా వివిచ్యమాను డైనప్పటికిని ఎట్లు నాయొక్క అంశవిశేషమో అట్లేగ్రాహ్యాము విశేషముగా వివిచ్యమానమైన నాయొక్క శక్తి ప్రసారమే అని చెప్పుచున్నాను.

అంతరిక్షం పృథ్వీ అని యేదేశము కలదో అహస్సు రాత్రి యని ఏ కాలము కలదో నిశ్చయించబడినటువంటి ఆయీా గ్రాహ్యాద్వయము ఏమట్లయొక్క ప్రసారమో ఆ భానతిరోధానాలు ప్రపంచస్వరూపమయిన నా యొక్క శక్తి ప్రసారమే. సమస్తమైన అర్థజాతముయొక్క ఏభానతిరోధానముకలదో అది నా యొక్క శక్తి ప్రసారమే. శక్తి సంభేదమే పదార్థాలయొక్క భానముకద. తద్విభేదమే తిరోధానము. ఈ అర్థమే మునుపు చెప్పబడియున్నది. ఇట్లు ఉండుచుండగా పదార్థాలయొక్క భానతిరోధాన రూపమయిన ఏ యీాశక్తులుకలవో వాటియొక్క ప్రసరభూత మయినటువంటి ఏ దేశకాలముల భావప్రతియోగిత్వముచేత ఉండుచూ ఉన్నదో అది నా కంటే బహిర్భావముగా నుండలే దని తాత్పర్యము. ౮.

భానతిరోధానములచేతను 'సృజనమవుచునున్నది, నాశమవుచునున్నది' యని ఏ కృత్యంతరం కనుపఱుపబడినదో దానిని విశేషముగా విభజించి చూపుచున్నాడు :—

"ధూమావతీతి":—అధ్వలయొక్క తిరోధానమందు ధూమావతీ అనే నా యొక్క శక్తి ప్రసిద్ధమవుచునున్నది. ఆప్యాయనమందుహ్లాదాఖ్యమయిన శక్తి ప్రసిద్ధమవుచునున్నది. అవభాసనమందు భాస్వతీ అనే శక్తియు, క్షోభయందు స్పందాఖ్య శక్తియు, వ్యాప్తియందు విభ్వీ అనే శక్తియు నా యొక్క యైదు శక్తులును ప్రసిద్ధమవుచున్నవి. ౯.

శక్తులు అప్రత్యక్షము గనుక కార్యముఖముగానే ఆ శక్తులు నిరూపింపబడుచున్నవి :—

''ధూమావతీ పృథివ్యామితి'':— పృథివియందు ధూమావతీ, అప్పునందు హ్లాదా, తేజస్సునందు భాస్వతీ, వాయువందు స్పందా, ఆకాశ మందు విభ్వీ ఈ అయిదు శక్తులును ఈ అయిదు భూతములయందును వ్యక్తముగా కనబడుచున్నవి. ఇట్లు ఉండుచుండగా భావాలయొక్క ఏ యేశక్తులు కలవో వాటియొక్క ప్రసరభూతమయిన ఏ దేశమును కాల మును భావప్రతియోగిత్వముచేత ఉన్నవో అవి మద్బహిర్భావముగాలే వని తాత్పర్యము. ఈ ప్రకారం షడధ్వాత్మకమయిన జగత్తు వీటిచేత వ్యాప్తమయినది ; నా యొక్క ధూమావత్యాది శక్తులచేత నిశ్చయించ బడినది. దీని చేతను ఆత్మకు పంచకృత్యకారిత్వము ప్రదర్శింపబడె నని సర్వదా తెలియదగినది. అదే సరి. అవభాసన మనగా సృష్టి ; పుష్టి అనగా స్థితి; క్షోభ మనగా సంహారము; తిరోధాన మనగా తిరోధానము; వ్యాప్తి అనగా అనుగ్రహము ౬.

ఈ ప్రకారము అవభాసమానమయిన శక్తులచేత చెప్పబడినటు వంటి జగత్తుయొక్క విమర్శశక్తి స్పర్శమాత్రముచేత ప్రకాశైకా త్మ్యన్ని పొందుచున్న దని చెప్పుచున్నాడు.

''నిజధర్మిణమితి'':—విమర్శరూపమయిన శక్తి అనగా ప్రత్యవ మర్శాత్మకమైన ఏ యోచితికలనో ఆ చితి సమస్తమునున్ను నా యొక్క శరీరంగాచేయుచున్నది. శివాది ధరణ్యంతమైన ప్రపంచమును మదే కాత్మకముగా చేయుచున్న దని తాత్పర్యము. ఎటువంటి దవుచు అనిన ధర్మభూతమై తనకు భిత్తిభూతముగా ఆశ్రయమైనటువంటి ప్రకాశమును తదభిన్నత్వ ఏకరూపమైన చైతన్యమును ప్రకాశ్యవర్గానకు స్వరూపం వలెనే చేస్తున్నది. అనగా తెలుస్తూ ఉండే ఘటపటాదులను యాథార్థ్యంగా వ్యవస్థాపన చేస్తున్నది. సమస్తమైన వేద్యజాతముయొక్క విచారణ తుదిముట్టేటప్పుడు నిర్బాధంగా మిగిలినటువంటి రూపము ప్రకాశమే అని స్వానుభవ సాక్షికంగా ఉపాదిస్తున్నదని తాత్పర్యము. నా యొక్క ఈ విమర్శశక్తి షడధ్వాత్మకమై శివాదిధరణ్యంతమైన ఈ సమస్తమును నా స్వరూపముగానే ఆపాదిస్తున్నది. అదే సరి. ౭.

''జ్ఞాతృజ్ఞానేతి'':—సర్వాధ్వవ్యాపకమైన ఏ నా యొక్క విమర్శ కలనో వహ్ని శిఖాకారమైన ఆ నా యొక్క విమర్శము జ్ఞాతృజ్ఞాన జ్ఞేయాత్మకమైన సమస్త ప్రపంచమును దహించి అనగా జ్ఞాతృత్వమే మొదలుగా కలిగినటువంటి మూడు విశేషాలను పోగొట్టి ప్రకాశ సామాన్యాత్మకమును, అకృత్రిమానంద ఘనము గనుక క్లేశాదులచేత అకలుషితమైన సత్తామాత్రమును, అయిన భస్మగా విభూతిని శేషింప చేస్తున్నది. తదేకార్ణవముగా చేస్తున్న దని తాత్పర్యము. ౮.

ఓయీ! విమర్శానంతరం వేద్యాంశయందు భేదలయం అనేది యుక్తమే. గ్రాహకునికైతే భేదం చేత ఉండుటవల్ల ఒకానొకప్పుడు భేద కలా లేదంటే చెప్పుచున్నాను:—

''అకరోదితి'':-అక్కడ జ్ఞాతృజ్ఞానజ్ఞేయాత్మకమైన సమస్తమును అత్యంతము కఠోరమైన నా విమర్శ జ్వాలాగ్రస్తమవుచుండగా ''నేను విచారింపబడినవాడు'' అని అహమంశయందు భేదము ఉండుటవల్ల అసత్తు ప్రకాశింపబడినటువంటి దాహకశక్తి కలిగినటువంటి నా యొక్క విమర్శవహ్నిచేత ఆక్రమింపబడినదై గ్రాహకవర్గానకు శేషించినటు వంటి అహమనేబుద్ధి యెట్లు ఆచ్ఛాదింపబడుచున్నది. ఉపసంహారము చేయబడిన వేద్యముకలదౌటచేత అభేదమైన వేద్యాంశావిస్ఫూత ప్రస రణముచేత అంగారమువలెనే ఆపాదింపబడినది. భస్మవలెనే ప్రసిద్ధ మవుచున్నది: అంతస్థితమైన సూక్ష్మాంగార భసితరాశి సమంగా తోచ బడుచున్నది. ౯.

ఎప్పుడు ఆదాహమే వక్రమో అప్పుడు చూడు అని చెప్పుచు న్నాను:—

''కార్త్స్న్యేనేతి'':- సర్వ భేదసంహారణైక స్వభావ విమర్శాత్మక మయిన నాచేత నిశ్శేషముగా విచారింప బడిన యీ శివాదిజగత్తు (కారుచిచ్చు ?) ...చేత ఆశ్రయింప బడిన అరణ్య పురాదికమువలెనే అవాంతరభేదమును పోగొట్టి ఏకరూపత్వము స్వాత్మయందు మగ్నము

చేసుకొనక ఆ రూపత్వమును గ్రహిస్తున్నది. అనగా ప్రకాశైక స్వరూప మవుతున్న దని తాత్పర్యము. నను అనుటచేత ఈ అర్థము సర్వానుభవ సిద్ధ మని నిశ్చయింప బడుచున్నది. ౧౦.

కృత్స్నంగా ఆవేశన ప్రకారమును వివరించి ఉపదేశం చేస్తు న్నారు:—

"అంతర్ముఖేతి":— ఇక్కడ బహిర్ముఖ మని అంతర్ముఖ మని భావాలకు రెండు స్వరూపములు కలవు. మొదటిది స్థూలమును పరస్పర భేదము కలదియు బహిర్ముఖము అనబడును. అంతర్ముఖ మనునది సూక్ష్మము, అభేదము, పరమార్థరూపము. ఇట్లు ఉండుచుండగా జ్ఞేయ మయిన ఘటాదులకు "యదంతర్ముఖం పారమార్థికం స్వరూపం"— అంతర్ముఖమయిన యేపారమార్థిక స్వరూపముకలదో అది ఘట మనేదే మొదలుగా గలిగిన జ్ఞానమేను. బాహ్యమయిన ఆకారము దీనినుంచియే ఉత్పత్తి. గనుక, ఆభిత్తి లగ్నత్వంచేతనే ఉండుటవల్ల అక్కడనే లయం ఉండుటవల్లను దీనికిని జ్ఞాత ఘటాది జ్ఞానమునకును ఆ ఉభయస్థితి నిదాన భూతమయిన గ్రాహకుడే అభిమంతృరూపమైన అంతర్ముఖం స్వరూపము. ఈ చెప్పిన ప్రకారముగా జ్ఞేయాది విభేదము కలిగిన జ్ఞాతృతాపన్నమైన జ్ఞానానకు ప్రత్యవ మర్శాత్మకమయినచితే అంతరతమ మయిన విశ్వము. ఈ చితికి "నేను" మరి ఒకటి లేదు. ప్రత్యవమర్శ లక్షణమయిన చితికి ప్రత్యవమర్శాంశ నిమజ్జనమందు నిష్కళంక ప్రకాశాత్మకుడు నేను అనే ఆ అహమే. తుది పొందిన తత్వం మరియొకటిలేదు. ఇంద్రియార్థ సంబంధ సమనంతరం ఇది ఘటం అని యేవికల్పం పుట్టునో ఆ ఉత్పత్తి కన్నా మునుపు ఘటానకు ఘటత్వంగాని వస్త్వంతరత్వంగాని నిశ్చ యించడం అశక్యము గనుక నాకు వ్యతిరిక్తమయిన అర్థము ఏమి లభిస్తున్నది? కాగా జ్ఞేయానకు అంతర్ముఖమయిన రూపము జ్ఞానమేను. జ్ఞానానకును జ్ఞాతైకాయత్త మయిన ఉదయ లయానకు జ్ఞాతేను, పరమార్థ మయిన అంతర్ముఖ స్వరూపము ఈ న్యాయంచేత చితేను. చితికిన్ని నేను ఒకడే అనువర్తించిన తత్వం. ఈ ప్రకారం సమస్తము

తోడను విమర్శజ్ఞావేశముకలుగుచునుండగా కూడ గ్రాహకాదులకు ప్రకాశంతోడ ఏకరూపత్వము కూడా నిర్వివాదము అని ఉపదేశం చేయబడుచున్నది. ౧౧.

ఈ ప్రకారం జ్ఞేయాదిత్రికానకు ప్రకాశకంటే భేదాభావాన్ని ఉపపాదించి పరస్పరమును భేదం లేదని వివేచనచేయబడుచున్నది.

"అక్రమతేతి":-నిష్కృష్టప్రకాశాత్మకుడయిన నాకు చిత్యాది చతుష్టయానికంటే అక్రమత్వమే అన్నిటియందు అంటి ఉండుటచేత భేద నాశము అసంభవం గనుకను జ్ఞాతా జ్ఞానం జ్ఞేయ మని పరస్పర భేద రూపంగా ఉండుటవల్లనుంచియు నీ మూండేక్రమికము. చిత్తైతే క్రమా క్రమ జ్ఞాత్రాద్యపేక్షచేత సక్రమమైనది నన్నపేక్షించి అక్రమము; ఇట్లన రెండు రూపములు, ప్రబుద్ధుడైన నీకు ప్రతీతి. ప్రతీతి ప్రకారము విచారిస్తే నావలెనే జ్ఞాత. ఎట్లనంటే- చిత్యాది చతుష్టయానికంటె అభేదమైన నాకు క్రమరహితత్వము. అట్లే జ్ఞానజ్ఞేయాలకంటే అభేదమైన ఆ రెంటికంటే నాకంటే జ్ఞాతము అక్రమత్వము అని చితిజ్ఞాత్రాదులను అపేక్షించి సక్రమమో నన్నపేక్షించి అక్రమ మని ఉన్నదో, అట్లే జ్ఞానమున్ను జ్ఞేయానికంటే ప్రక్రమము, నాకంటె అక్రమ మని; జ్ఞాత నే నని, జ్ఞానం శక్తి అని, జ్ఞేయం వేరు అని, త్రితయమువలెనే తెలియ తగింది. ఏవిధముగా జ్ఞాతయు నేనును అక్రమమో అట్లే మా యిద్దరి కంటే జ్ఞేయము అక్రమము, సమానం కాదు. ఈరీతిగానే శక్తిజ్ఞానములను అపేక్షించి, (క్రమాక్రమాక్రము) జ్ఞేయాంతరాపేక్షచేత సక్రమమే అని మూడురూపములు. దీనిచేత ప్రకాశాపేక్షచేత సర్వం అక్రమము; పర స్పరాపేక్షచేత జ్ఞాత్రాదిసర్వం సక్రమము; చిత్తైతేను ఉభయాపేక్షచేత ఉభయరూపము అని యేభ్రమకద్దో అది నిరసనచేయబడెను. ఏకారణాన జ్ఞాత నేను అని జ్ఞానం శక్తి అని జ్ఞేయం మూడోది అని తత్త్వాంతరం లేదో ఆకారణాన ఇక్కడ ఇట్లు అభిప్రాయము. ఇది వనం అనేటప్పుడు తర్వపేక్షచేత వనమునకున్ను వనాపేక్షయా తరువుకున్ను ఎట్లు అభేదమో అట్లే సర్వత్రాభేదమేను. ఎప్పుడైతే చూతం చంపకం అనే జ్ఞానమో,

అప్పుడు వనాపేక్షయా చూతచంపకాలకు అభేద మని భదం లదు. పర స్పరాపేక్షచేత అయితేను వ్యావృత్తే అని భేదము. ఈప్రకారంగా ప్రకృతమందున్న సమష్టిభూత ప్రకాశను అపేక్షించి వ్యష్టిసమష్టులకు భేదం లేదు, పరస్పరమైతేను యథాయోగ్యముగా ఉంటున్నది. అది కారణంగా సర్వత్ర అనువర్తించి అక్రమత్వం సక్రమత్వం అని రెండు రూపములు భేదము అని ప్రకాశైకాత్మ్యకంటే పారమార్థికము. ౧౨.

భేదము సత్తుకే విలసితమైన దని అదే విశదీకరించి చూపబడు చున్నది:

"ఏతాదిష్వితి":–జ్ఞేయము జ్ఞేయాంతరాపేక్షచేత సక్రమమే అని యేది చెప్పబడెనో దానిని ఉదాహరించేటందుకొరకు చెప్పుచున్నాను. ఎప్పుడు పీత మనే జ్ఞానమో అప్పుడు నీలం కాదు ఈప్రకార పరస్పర భేద రూపముగనుక జ్ఞేయము జ్ఞేయాంతరాపేక్షచేత క్రమికమేను అని యేదిచెప్పబడెనో అజ్ఞానము శక్తివలెనే సక్రమాక్రమ మని దానిని ఉదా హరించి చూపుచున్నాడు :— ఆపీతాదులయందు, ఇక్కడ నీలమందు శ్రావణజ్ఞానం ; అదిన్ని చాక్షుషమున్ను ఇట్ల సక్రమాక్రమం జ్ఞానం శక్తివలెనే అనియుక్తం. నావలెనే జ్ఞాతా అని యేదిచెప్ప బడెనో అందు కోసరం చెప్పుచున్నాను—ఆనీల పీతాదులయందు అభేదరూపంగనుక నావలెనే జ్ఞాతా అనుట సిద్ధము. ౧౩.

ఏకారణమువల్ల ఈప్రకారం అర్థస్వరూప నిర్ణయమో ఆకారణము వల్లను, "గాతారమితి":– చెప్పిన ప్రకారం వికల్పహేత్వసంభవంవల్లను జ్ఞాతృప్రకాశలు ఏకాత్మ్యంచేత భేదసంస్కారోపశమాంతం దృఢప్రతీతి చేత పరిశీలనచేయుటవల్లను అభేదభ్రమోపశమలక్షణ సిద్ధించును. అప్పుడు జ్ఞానమును శక్తిని అవికల్పముగా భావన చేయుటవల్లను ఆశక్తిఅజ్ఞానము చెప్పినప్రకారముచేత నే శక్తి జ్ఞానాలకు అభేదభావనా దార్ఢ్యంచేత ఆ అభేదజ్ఞానరూప మయినసిద్ధి. అప్పుడు తృతీయాత్మకమును జ్ఞేయమును అట్లు భావనచేయుటవల్లను మూడును అదియు తెలియతగినది. స్వప్రకాశ జ్ఞాతలచేతను శక్తి జ్ఞానములచేతను వేద్యాంతరంచేతనుకూడా ఉండు

ఏయీాదురుద్ధరమయిన భేదభ్రమకలదో దాని నిక వేళ్లతోకూడా పెటికి వేయుట రూపకమయినసిద్ధి సద్యః కాలమందే. ఇక్కడ సోహం, సా, తత్రయం తచ్చ అనేమూడు వాక్యాలయందును భవతి అనేక్రియ చెప్ప లేదు. మరేమంటేను తాదాత్మ్య స్వరూపమే నిశ్చయించబడుచున్నది. అదికారణంవల్లనుంచియు వీటికి ఏకాత్మ్యం సాధించతగినది లేదు. మరే మనిన నిత్యసిద్ధమే అని చెప్పబడినటువంటి యుక్తులచేత తెలుస్తున్నదని ఆచార్యులచేత చెప్పబడినది. ౧౪.

అక్కడ జ్ఞాతకు క్రమికత్వం నిత్యసోపాధికం గనుక ప్రకాశ తాదాత్మ్యం నిత్యసిద్ధ మని చెప్పుచున్నాడు:—

''సంతానేతి'':- నీలసంకల్ప వికల్పాద్యనేకసంతాన సమనంతరం పీతసంకల్ప వికల్పాది సంతానం ప్రవహిస్తుండగా నీలాన్ని తెలిసిన వాడై తిని, పీతాన్ని తెలిసినవాడై తిని: ఇట్లని పరస్పర పరిహార రూపం చేత అవస్థితి గ్రహణంవల్లనుంచియు గ్రాహకుడు క్రమంకలవాడు. ఎప్పుడు యిట్లు క్రమికత్వమో అప్పుడే వీడు జీవనామకుడు. వస్తుతః సత్తు అయిన శివునికి జీవు డనేసంజ్ఞ తత్కాలమాత్రమేను. నాయందు ఏ యీ క్రమి కత్వం కద్దో అది ఉపాధికృతమేను. విచారిస్తే నీలమున్ను పీతమున్ను ప్రకాశించేది గనుక అభేదమయినవా డవుచు సర్వదా అన్నిటియందు అభేదప్రకాశాత్మ కలవాడ నగుచున్నా నని ప్రకాశస్వరూపమయిన నా యొక్క ఏతాదృశ యోగంవల్లను వస్తువిమర్శలక్షణ మయిన. . .సంస్పర్శ వల్లను నావలెనే అక్రమాభాస అవును. ఎట్లు ప్రకాశ నిత్య అక్రమ మవునట్లుగానే ప్రకాశిస్తున్నదో అట్లే గ్రాహకుడున్ను ఆపీతాది గ్రహణ దశయందే ప్రకాశైకాత్మ్యంచేత అక్రమంగానే ప్రకాశించుచున్నాడు. ఇట్లనుటచేత ప్రబుద్ధునికి విశ్వప్రతియోగి కత్వ మెప్పుడో అప్పుడే శివత్వం; ఎప్పుడు ప్రతి నియతమయిన అర్థానకు ప్రతియోగికమో అప్పుడు గ్రాహకత్వము అని; ద్విరూపత్వాతిక్రమణాభావంవల్లను జీవత్వ సంస్కారము సర్వదా అభేదమే అని ఏ యీ భ్రమకద్దో అది దూరముగా పరిహరించబడెను. చెప్పిన న్యాయంచేత పీతాది గ్రహణదశయందును

అక్రమ పరిపూర్ణైక ఘనప్రకాశ స్వభావం వల్లనుంచి ఇట్లు ఉపదేశం చేయబడుచునున్నది. ౧౫.

వేత్తకు అతిరిక్తంగా వేదన మని వేద్య మని కక్ష్యాద్వయ కల్పన చేత నెంత పర్యంతం ఉండునో విమర్శ బుద్ధ్యాకలనం అంతపర్యంతమే ఉండుచున్నది. వేద్యంబును వేదనమును విమర్శ చేస్తే రెండును ప్రకాశ బహిర్భావంగా లేదు అని ఉపదేశం చేస్తున్నాడు.

''వేద్యమితి'': ఓయి భోగాయతన భోగ్యాత్మక మైన దేహ పీఠాది వేద్యమయిన విషయాదికము అర్థంచేతనే విశేషం కద! నిరాకారత్వ బుద్ధి చేతను అనే న్యాయంచేత ఏ అర్థం ఉపాధియో తాద్రూప్యాన్ని పొందుతూ ఉండేటటువంటి దవుచున్న వేదనమును (వేదన మనగా జ్ఞానము) అనుసరించి ప్రవేశిస్తున్నది. గ్రహణకల్పన నివృత్తి అవుట వల్లను ఇంద్రియ వ్యాపార వృత్తియందు పీతజ్ఞానము నాకు ఆయె నని వేద నాత్మత్వమును పొందుచున్నది. వేత్తయందు విత్తిలయ సమయమందు జ్ఞానాన్ని ముఖీకరించుకొని లీనమవుచున్నది. అట్లు లీనమైన దవుచున్న తాదృశ లక్షణమయిన దవుచున్నది. ఎట్లంటే—బుద్బుదము ఊర్మిలయ ద్వారా సముద్రమందు ఎట్లు ప్రవేశించునో తద్వత్- దానివలెనే తదే కాత్మత్వమును పొందుచున్నది. ఇక్కడ ప్రకాశ సంబంధమే అయిన శివాది వస్తు తదుదయ స్థిత్యాది తద్భేదాదిరూప ప్రపంచాత్మకంగా స్ఫురించుటవల్లనుంచియు ప్రకాశ బహిర్భూతం కించిత్తును లభించేది లేదు. ఆకారణంవల్లనుంచియు వేద్య వేదనాది వికల్పాలకు తరంగాదుల వలెనే తదభిన్నత్వంచేతనే దానియందు నిమజ్జనము. అదే వేదిత్రాది వస్తుసత్తా తదుదయాది వస్తుసద్భేదశ్చ అస్యార్థస్యైవ ఏవం విమర్శ ఏవ శివత్వం. ఆకారణాన విమర్శ ప్రబుద్ధత్వము అవిమర్శ పశుత్వ మని ఉపదేశ నిష్కర్ష. ౧౬.

అనంతరం వేదకునికి సః త్వం అనేదే మొదలుగా కలిగిన భేదమును ఆశంకించి పరిహరింపబడినశ్లో ప్రథమా మధ్యమ ఇత్యాది

కంచేత వేద్యానకున్ను సత్యాది ప్రత్యయ విషయంచేత భేదశంకను పరిహరిస్తున్నాడు.

"స్మృతీతి": స్మృతివల్ల నుంచియు అది యని అనుభవంవల్ల నుంచియు ఇది యని జ్ఞాపకము. శివాదిజగత్తును స్వతంత్రు డయిననేను సృజనచేస్తున్నాను. ఎట్లంటే కొట్టుటచేతను ఉదకాలు పరస్పర వ్యావృత్తభేదంచేత భిన్నముచేయబడెను. అభిన్నమును స్వకీయ మహిమచేత పరస్పరభేదానకు అన్యోన్య నిమేషరూపత్వంవల్లను భిన్నత్వంచేత సృజనచేస్తున్నాను. అనిచెప్పిన యుక్తులచేత విమర్శ చేయబడుచుండగా వ్యావృత్త్యుపశమమువల్లనుంచియు అభిన్నము విమర్శ వ్యావృత్త్యాత్మక నానా సిమేషగ్రసనైక స్వభావత్వం గనుక విమర్శశైథిల్య మందయితేను అది యిది యనేదే మొదలుగా కలిగిన భేదాభేదరూపం వల్ల నుంచిన్ని ఉదయం చేయబడినట్టయితే విమర్శ అది యిది అనే విశేష విఘటనం వల్లనుంచిన్ని ప్రకాశసామ్రాజ్య మని భావము. ౧౭.

చెప్పినన్యాయంచేత ప్రకాశమేభిత్తిత్వంగా ఆశ్రయించి తదభిన్నత్వంచేతనే అది యిది యనేదే మొదలుగాగల భేదాలయొక్క ఉదయలయాదులను పొందుతూ ఉండేభేదవాదియొక్క బాధకమైన తర్కమును చెప్పుచున్నాను.

"స్మృతిరితి":— ఇది నీలము అని నీలవిషయమైన జ్ఞానానకు యేయిాభానమో అది నీలాద్యర్థాపేక్షచేత నైసస్మృతి. ఆ అర్థానకు అది అనే స్మృతి మూలభూతమైన అనుభవం పరామర్శ చేయబడుచున్నది. అర్థస్య అనేటప్పుడు భాన మని సంబంధింపబడుచున్నది. అర్థానకు భానం అనుభవ మని అర్థము. వీరిద్దరూకూడా కూడినవారు అనిదృష్టార్థ ప్రతిసంధానవేళయందు ఏకప్రత్యయత్వాన్ని పొందినటువంటి వారియొక్క అనుసంధానమే ప్రత్యభిజ్ఞా అనిచెప్పబడుచున్నది. ఆ యీాక్రమిక ములు ... త్రితయమును నన్ను ఒకని వినాయించి క్రమరహితమయిన గడిచేదిలేదు. సర్వప్రతిభాజనము అనుస్యూతమయిన ప్రకాశమును వినా

యించి సంబంధింపబడేది లేదు. క్రమికము ఎట్లు సర్వానుసంధాతో ప్రకాశము పొందపడదో అప్పుడు క్రమికాభిమతం తదిదమిత్యాదికమును నిర్భిత్తికమయినచిత్రమును పొందుచు నున్నదని యర్థము. ౧౭.

ఏకారణమువల్ల నిట్లో ఆకారణమువల్లః— "అస్తమిత" మితిః అనంతరము అస్తాన్ని పొందిన నీలజ్ఞానం నాకు పుట్టెను. ఇత్యుపరితస్య దశయందు అస్తమును పొందుచున్నది. భిత్తిని అనుప్రవేశిస్తున్నది. నీలజ్ఞానమునకును ఉపశమనసమయమందు నీలము అస్తమాయె నని అడ్డగిస్తున్నది. ప్రకాశమధ్యమందే యెట్లు లీనమవుచునున్నదో అట్లే మద్భావైకత్వం చేత నాయందే ఉన్నది. ఎట్లంటే ప్రవాహాము ప్రత్యేకమువలెనే ప్రకాశిస్తున్నది; సముద్రమందును లీనమవుచున్నది. దూరంగాప్రవహించేనది ప్రత్యేకమువలెనే ప్రకాశిస్తునున్నది. సమీపమందు లీనమాయె నని రెండు రూపములైతేను భేదాన్ని అడ్డగిస్తున్నది. అద్వైతాత్మత్వంగా ఉంచున్నది. అట్లు అర్థసముదాయమును ప్రకాశైకాత్మకమె సమీపమందవుచున్న దని తాత్పర్యము. ౧౮.

ఇతి తృతీయస్కంధస్సమాప్తః.

---

# చతుర్థ స్కంధము

విభూతిస్కంధము

అథ చతుర్థవిభూతిస్కంధము ఆరంభంచేయతగినది.

అంతర్నిరంతర నిరింధనమేధమానే
మోహాంధకారపరిపంథిని సంవిదగ్నౌ
కస్మింశ్చిదద్భుతమరీచి వికాసభూమౌ
విశ్వంజుహోమివసుధాదిశివావసానమ్.

*　　　　*　　　　*　　　　*

అనంతరము నాలుగవది యయిన విభూతిస్కంధము ఆరంభము చేయ తగినది. అక్కడ విభూత్యావిర్భావాంగముగా అప్రబుద్ధాదులకు ప్రతీతిప్రకారము మొదట నిరూపింపబడుచున్నది. 'మస్థనుపిభువన బృందం' అనేది మొదలు నాలుగు శ్లోకములచేతను వివరించుచున్నాడు :—

అక్కడ అప్రబుద్ధుడు, ప్రబుద్ధకల్పుడు, ప్రబుద్ధుడు, సుప్రబుద్ధకల్పుడు, సుప్రబుద్ధుడు అని అయిదుగురు ప్రమాతలు. వారియందు ఎవనెవనికి ప్రతి ఎటువంటిదో అది విభజనచేసి చూపబడుచున్నది. 'మస్థమపి' అని చెప్పబడ్డ న్యాయంచేత ప్రకాశాత్మత్వం చేత మద్భిత్తిలగ్నమయినదయినప్పటికిని అనగా ప్రకాశభిత్తి లగ్నమైనప్పటికిని అనాశ్రితాది కాలాగ్నిరుద్రాంతమైన భువనబృందము సాంఖ్యాదిసిద్ధాంతపరులైన భేదప్రతిపత్తికలవారికి ప్రకాశానకంటె వేరువలెనే ప్రకాశిస్తుంది. అక్కడ కారణం మాయచేతను ; అభిన్నవస్తునందు భిన్నప్రతీత్యాత్మకంగా ప్రకాశిస్తున్నందుకు కారణం మాయయే. వారికయితేను భేదంలేక ఏసంస్కార రూపకమైన భేదభ్రమతోచుచున్నదో వారు భవపదులు, అనగా జ్ఞానం చేత తెలిసేవారు. సమాధి స్వరూపం తెలియకనే ఉండేవారును. వారికి అంతఃగాను బాహ్యంగాను తోచబడుచున్నది. లోపలను సంకల్పాది రూపత్వంచేత భిన్నంవలెనే ప్రకాశిస్తుంది. అక్కడ శుద్ధవి...వుచేతను.

అనంతరం వీరిలో నెవనికి బాహ్యాంగా ప్రకాశిస్తున్నదో వాడు ఈ సంవిత్పదమందు పశు వని........నేది అని చెప్పుచున్నాడు :—

"గ్రాహకమితి": అజడమైన చిదాత్మకము ఒకటి, గ్రాహకము జడమై అచిదాత్మకమైన అన్యము గ్రాహ్యము. ఎవడు అన్యముగా తెలుస్తు న్నాడో వాడు మాయావిమోహితాత్ముడు. గ్రాహ్యాభిమతమైన వస్తువు నందు జడత్వంగాను అన్యత్వంగాను ఏ యీ ప్రతీతికలదో అదే మాయ దానిచేత మోహితాత్ముడు స్వరూపం తెలియనివాడు. ఆకారణంవల్ల నుంచియే స్వస్వరూపాన్ని తెలిసినటువంటి గురువులచేతను, భవి అనిన్ని అణువు అనిన్ని బోధించబడినవాడు. ఇట్లు అన్నందుచేతను తార్కికమీ మాంసకాదిసిద్ధాంతపరులకు ప్రపంచ స్వరూపాలకు భేదం తెలుసుకొని ఉంటే సంవిచ్ఛాస్త్రోపదేశ విషయమైన అధికారం లేదని ఉపదేశంచేయ బడుచున్నది. వాంద్రకు సంవిత్సిద్ధాంత ప్రదర్శనం చేసినట్టయితే ప్రత్య వాయం కద్దని శ్రుతియు 'అన్యస్మైకథనం కుర్వన్నకాలే మృత్యమాప్ను యాత్' అదికారణంవల్లనుంచిన్ని పశువుల విషయము. సంవిచ్ఛాస్త్ర సిద్ధాంతార్థము గోప్యం చేయతగినది అనే శివాజ్ఞ సర్వథా ఉల్లంఘన చేయకూడదు. ౧.

ఈ ప్రకారం అప్రబుద్ధునికిని ప్రబుద్ధకల్పునికిని ప్రతీతి ప్రకారము అంతరము విభజించి చూపబడెను. ఎవడు ప్రబుద్ధుడో ఇప్పుడు విభజించి చూపబడుచున్నది :—

"జడతామితి":— భేదాభేదోభయ దశావస్థకలవాని విషయమై ఈ పరిదృశ్యమానమైన వస్తువు జడం. జడాత్మకమైన వస్తువునందు ఇదంత గాను,అనంతరము అజడాత్మకమైన అహంతానున్న సామానాధికరణ్యాం వల్ల అహ మని తోచబడుతూ ఉండేటటువంటి అజడమైన వస్తువును సామానాధి కరణ్యాంవల్ల భేదారోపణ లేకయే భేదాంశను పరిహరించే వాడవుచును, ఇది నేను అని తెలుస్తున్నాడో స్వశరీరంవలెనే ద్విరూ పంగా చూస్తున్నాడో ఆ యీదశ ఈశ్వరదశ. ౩.

అనంతరం ఎవడు సుప్రబుద్ధకల్పుడో ఎవడు సుప్రబుద్ధుడో వారి యొక్క ప్రతీతిప్రకారతను వివేచన చేస్తున్నాడు :—

"ఉద్భవినామితి":–అభేదప్రతిపత్తిలక్షణమైన కైవల్యం ఉద్భవము. ఆఉద్భవంకలవారికి అహమాత్మికమైన స్వస్వరూపమందు నిమగ్నం ప్రకాశిస్తున్నది. విమర్శక శక్తిరూపక మైన హేతువుచేతను ఇదంప్రతీతి విషయమైన వేద్యం దృష్టిచేత ఆచ్ఛాదింపబడినదిగా తోచుచున్నది తనయందు స్ఫుటమైన ఇదంత యీ అహంతాచ్ఛాదితమైనది సదాశివదశా: అనంతరం స్వత ఏవ పూర్ణమైన సుప్రబుద్ధుని ఇతనియందే ప్రకాశాత్మక మైన మగ్నోనగ్నోభయమైన ఇది నిమిషితత్వంచేతను ఉన్మిషితత్వం చేతను ద్విరూపత్వంచేతను తోచబడేది లేదు. ఎట్లంటే సముద్రము తరంగాదులవలె ననిమేషమున్ను ఉన్మేషమును కలిగినది అవుచునున్నది. సమస్తమైన దశయందు సముద్రమే. ఆప్రకారం శివాది విశ్వం అహమాత్మకమేను. సమున్మిషితమయిన అహంవ్యతిరిక్తము అహమందే లీనమౌచున్నది. ఉన్మనా అనే హేతువుచేతను ఈ ప్రకారం వస్తుయాథాత్మ్య ప్రత్యభిజ్ఞానము; అట్లు స్వరూపావసితే ఉన్మనా అనగా ఈ ప్రకారం ఉపదేశంచేయబడిన క్రమమున ఆలోచింపగా ఉన్మనచేత నెప్పుడు పూర్ణత్వ సిద్ధి అచంచలమైన దవుచున్నదో అప్పుడు ఆ యోగి సిద్ధుడు సుప్రబుద్ధుడు అని చెప్పబడుచున్నాడు. ౪.

ఆయోగికి ఇచ్ఛామాత్రంచేత అభిమతములైన విభూతులయొక్క ఆవిర్భావము అవుచున్న దని రవిసోమేత్యాది ఎనిమిది శ్లోకములచేతను చెప్పుచున్నారు. ఇక్కడ ౫....౮...సిద్ధ్యా విర్భావమును విస్తరింప చేస్తున్నాడు :

"రవిసోమేతి":— సూర్యుడు చంద్రుడు మెరుపులు వజ్రాయుధం, మేఘం, బడబాగ్ని, సముద్రం గుహలు అరణ్యములచేతను దృఢంగా భావింపబడిన ఆత్మభావములచేతను యోగి ఆయాకర్మను నిర్వహిస్తున్నాడు. ౫.

"యాదేవ తేతి":- గణపతి సరస్వతి హరిహరాదులు మొదలుగా కలిగినటువంటి యే దేవతలు లోకమందు కలరో వారు విఘ్నధ్వంసన వాక్ప్రవర్తన పాలన సంహరణాదికమైన యేకార్యములను చేయుదురో, ఆయాకార్యములను సాధించవలెననే యిచ్ఛ గలవారికి ఆసాధనేచ్ఛ యందు నిశ్చయించలంగా సిద్ధులు చెప్పుచున్నారు. ఏకా......సంధానం చేసిన యోగులు క్షణమాత్రం చేత ఆ అర్థ సిద్ధిపొందినటువంటి వారవు చున్నారు. ౬.

తత్త్వసిద్ధులను చెప్పుచున్నాడు :—

"ధారణేతి":— ధారణ అనగా పృథివీ సంగ్రహలక్షణ, అనగా అప్పు; పాకలక్షణ అనగా తేజస్సు, వ్యూహలక్షణ అనగా వాయువు, ప్రతిఘాతలక్షణ అనగా ఆకాశము, ఏతైః పంచ భూతైః ఈ పంచభూత ములచేతను తమ తమ యందు ఉండే అహంతలచేతను ప్రత్యహంతను దృఢ మాత్మత్వంగా అనుసంధానముచేతను యోగికి ఇష్టమైన క్రియలు జరుగుతున్నవి. ౭.

"ఇతితన్మాత్రేతి":-పంచతన్మాత్రలు ౫. కర్మేంద్రియాలు ౫. జ్ఞానేంద్రియాలు ౫. మనస్సు బుద్ధి అహంకారం ప్రకృతి (పురుషుడు?) యీ తత్త్వములయందు పూర్వోక్త ప్రకారమైన సాధన కలిగిన పురుషుడు ఆయాతత్త్వసిద్ధులను పొందును. ౮.

"రాగేతి":-రాగనియతి కా(కు?)ల విద్యాకలామయ—ఈశ్వర సదాశివశక్తి శివ యీతత్త్వములు ధారణగలయోగి ఈస్వరూపుడవును. ప్రసంగవశాత్ ప్రసంగంవల్లనుంచియు శుకాదిమహర్షుల ప్రతీతిని చెప్పు చున్నాడు.

* * * *

(అ స మ గ్ర ము)